ఆ చా ర్య రూ ప ం లో
అ ను గ్ర హ ం వ ర్షి స్తు న్న
'కన్నయ్య' అడుగుదమ్ములకు
చిన్ని ఉపద ఈ 'నీలివెన్నెలలు'

— ముత్తీవి లక్ష్మణదాసు

○

పాల మున్నీటిపై
నీలి వెన్నెలలు....
నీలి వెన్నెలలలో
పాల పెన్నలలు....
నీలి వెన్నెలలలో
పాల పెన్నలలలో
తులకించెదముగాక!
పులకించెదముగాక!

○

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య
శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రగురుదేవులు
ముముక్షుజనమహాపీఠాధిపతులు:

## ఆశీస్సు

శ్రీరస్తు చిరంజీవి ముత్తీవి లక్ష్మణదాసును
ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో ఆశీర్వదించి
వ్రాయునది -

ప్రియమైన బాబూ!

నీవు ఎంతో భక్తిశ్రద్ధలతో పంపిన "సిరివెన్నెలలు" అను చిన్ని గ్రంథం-కృతుల సంపుటి-అందుకొని చదివాను; ఎంతగానో ఆనందించాను. పద్యకవిత్వంలో నీకు చక్కని నైపుణ్యం ఉందని "క్వణత్కింకిణి" ఋజువు చేసింది; గద్యకవిత్వంలో నీకున్న శక్తికి మీ చెల్లెలూ నీవూ అనువదించిన "గోపీహృదయం" సాక్ష్యం పలికింది. కృతులు – గేయములు - రచించటంలో

కూడా నీవు శక్తిమంతుడవే అని ఈ "నీలివెన్నెలలు" తెలుపుతున్నది.

కవితా శక్తి కొందరిలో పద్యరచన ద్వారా ప్రకాశిస్తుంది; కొందరిలో వచన రచన ద్వారా ప్రకాశిస్తుంది; కొందరిలో కృతిరచన-గేయరచన-ద్వారా ప్రకాశిస్తుంది-కాని ఈ మూటిద్వారానూ ప్రకాశించటం అరుదు. అలా మూడు ప్రక్రియల్లోనూ నైపుణ్యం కుదిరితే అది గొప్ప అదృష్టం అనే చెప్పాలి. ఇక ఆ విధంగా ఉన్న కవితాశక్తిని కేవలం భగవత్పరంగానే వినియోగించటం అనేది అనేక పూర్వజన్మ సుకృత విశేషంచేతగాని సిద్ధించదు. భగవదనుగ్రహం ఉన్నవారికి కాని ఆఅదృష్టం లభించదు.

నీవూ, నీ చెల్లెలు కుమారి 'పాపా', అనంతమూ, వేంకటేశ్వర్లూ - మీ మండలి కవితా ప్రపంచంలో అత్యుత్తమ స్థితిని అలంకరించాలని ఆశీర్వదిస్తున్నాను; అలంకరించగలరుకూడా.

నాకు కవితాశక్తి లేకపోయినా, కవితాశక్తి కలవారంటే నాకు ఎంతోగౌరవం. ఎవరిలో అయినా, ఏమాత్రమైనా

కవితాశక్తి ప్రకాశిస్తున్నదంటే, వాళ్ళందరినీ ఆదరించి, గౌరవించటం మీ స్వభావంగా మారిపోవాలి.

భగవంతుడు మిమ్మల్ని సర్వవిధాలా అనుగ్రహించు గాక! ఇవే నా ప్రేమపూర్వక శుభాశీర్వచనములు !

ఇట్లు,

సదా మీ మేలుకోరు

సీ తా రా ం

శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావు.
ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము :
కొవ్వూరు; పశ్చిమగోదావరి :

## ఆశీస్సు

కన్నయ్యకే నీవు కనుపాప వైతివి
"నీలివెన్నెల" లిట్లు నెగడు టరుదె !
లక్ష్మి కగ్రజుఁడవై లక్ష్మణుం డైతివి
యేటేట "స్వాగతం" బెనఁగు టరుదె !
భక్తిమార్గంబున పాంథుఁడ వైతివి
గురు "భరన్యాసంబు" వరలు టరుదె !
రాగ భోగ త్యాగ యోగంబు నొందితి
"కర్మకౌశల" మిట్లు కలుగు టరుదె !

నీదు రచన "సౌలభ్యంబు" నివ్వటిల్లు
కృతిని చూడగఁ జూడ "దిదృక్ష" పెరుగు
సురుచి "లీలామృతము" న "మైమరపు" కలుగు
నీదు "అంతర్యము" న్గన మోదమొదవు !

నీవు వెలయించు నీలివెన్నెలలలోన
నీలమగు క్షీర నీరధిన్ "నీల" యనుచు
భ్రమసి "సిరి" బిల్చి, తెలిసి సాంత్వన మొనర్చు
నీలవర్ణుండు ని న్నెప్పు డేలుఁగాక !

నీలో బాలః తస్య నేత్రస్థ తారా
నీలా త జ్జాపాంగ మాలాఽపి నీలా
నీలా లోకా స్తత్కృతా శ్చాత్ర దీప్తిః
"నీలజ్యోత్స్నా" త(త్య)న్ముఖాబ్జాత జైవ!

కే. వేం. నృ. అప్పారావు

## తొలినుడి

అస్మద్గురుభ్యో నమః!

'సంతత శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానత' పరమలక్ష్యంగా కల నా సాధనకు ప్రధానసాధనం - కవితా వ్యాసంగం అనే సాహసం లేదుగాని - రచనా వ్యాసంగం. నా ఎడదలో కదలిన, మెదలిన భావాలకు - ఆరాధనకు, ఆవేదనకు, నివేదనకు - అన్నిటికీ అక్షర రూపం కల్పించాను. ఇలా చెయ్యటం సాధనకు ఎనలేని దోహదం చేస్తుందన్నది - అల్పమేఅయినా - నా అనుభవంలోని విషయం.

అలా కూర్చుకున్న గీతాలను 'నీలివెన్నెలలు' అను పేర చిన్ని గేయ సంకలనంగా ప్రచురిస్తున్నాను. మహాకవులూ, అనుపమాన తాత్త్వికులూ అయిన విశ్వకవి రవీంద్రులూ, సాధు మహాపురుషులు టి. ఎల్. వాస్వానీ రచించిన ఆంగ్లకవితలను కొన్నింటిని - ఆ మాధుర్యం విడువలేక - అనువదించుకొన్నాను - కృతజ్ఞతతో ఆ మహాపురుషులకు నమస్కరించి - వాటిలో కొన్నింటిని కూడా ఇందులో చేర్చాను.

నాలో ఈ దివ్వె వెలిగించినవారు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్ర గురుదేవులు. ఆచార్యరూపంలో అనుగ్రహం వర్షిస్తున్న ఆ 'కన్నయ్య'కే చిన్ని ఉపదగా సమర్పించాను ఈ సంకలనాన్ని. స్వీకరించి, ఆశీరమృతం వర్షించిన శ్రీవారి చరణ కమలాల మ్రోల శిరసా నమస్కరిస్తున్నాను.

శ్రీ శ్రీ శ్రీ యతీంద్ర గురుదేవులు వెలిగించిన దివ్వెను స్నేహార్ద్రం చేసి జాజ్వల్యమానం చేసిన సాహిత్యాచార్యులు శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పరాయలవారు - ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము - కొవ్వూరు;- శ్రీ అప్పరాయలవారికి నాయందున్న అపార వాత్సల్యానికి ప్రతీక వారి ఆశీస్సు - కృతజ్ఞతా భార వినమిత శిరస్కుడనై శ్రీ అప్పరాయలవారికి నమస్కరిస్తున్నాను.

చక్కని 'అనుశీలన'తో ఈ పుస్తకాన్ని అలంకరించిన మిత్రులు "భాషాప్రవీణ" శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య యం. ఏ. (సంస్కృతము) ఎం. ఏ. (తెలుగు) బి. ఇడి.; - ప్రధానాంధ్రోపన్యాసకులు, విశ్వోదయ కళాశాల - వెంకటగిరి - నన్ను శాశ్వతంగా ఋణగ్రస్తుణ్ణి చేసుకున్నారు.

గేయరూపములైన వీటినిపాడుకొని ఆనందించేందుకు నాకు సంగీతమూ రాదు; శ్రావ్యమైన శారీరమూ లేదు. కాని, ఆలోటు లేకుండా, నేను కాగితంమీద పెట్టిన వెంటనే వీటికి ఉచిత ఫణితి ఏర్పరచి, శ్రావ్యంగా గానంచేసి, తన మధురగానంతో నాలో నూతనోత్తేజాన్నీ, స్ఫూర్తినీ కల్పించిన, కల్పిస్తున్న, కల్పించనున్న అనుగు

చెల్లెలు చిరంజీవిని కుమారి ముత్తీవి అలమేలు మంగతాయారు - ఎం. ఎస్‌సి., - భౌతికశాఖా ప్రధానాచార్య - సెయింట్ థెరిసాస్ కాలేజీ - ఏలూరు - సహకారం ఎనలేనిది. హృదయపూర్వకంగా ఆశీర్వదించటం కంటె ఏం చెయ్యగలను నా చెల్లెలికి !

ఒండు రెండు తప్ప - ఇందులోని రచనలన్నీ 'ముముక్షువు' - ఆధ్యాత్మిక మాసపత్రిక - లో ఎడనెడ ప్రకటింపబడినవే. ఆనాడు ప్రకటించి ప్రోత్సహించటమే కాక, ఈనాడు పుస్తకరూపంగా ప్రచురించుకోనేందుకు అనుమతించిన ముముక్షువు పత్రికాధిపతులకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలి సమర్పిస్తున్నాను.

ముచ్చటైన అక్షరశిల్పంతో ముఖ పత్రాన్ని అలంకరించిన మిత్రులు శ్రీ కోపల్లె శివరావు, బి. ఎస్‌సి., కి హార్దకృతజ్ఞతలు తెలుపుతున్నాను.

ఈ ప్రచురణ భారాన్ని వహించిన 'సురుచి ప్రచురణలు' కార్య కర్తలకూ, ఎంతో శ్రమతీసుకుని, సకాలంలో, సర్వాంగ సుందరంగా ముద్రించి ఇచ్చిన ముముక్షువు ప్రెస్ మేనేజరు శ్రీ నందూరి గోపాలాచార్యుల వారికీ, ప్రెస్ పనివారికీ - అభివందన పురస్సరంగా కృతజ్ఞత తెలుపుతున్నాను.

శ్రీకృష్ణ జన్మాష్టమి
సౌమ్య - శ్రావణము
4 - 9 - '69

ముత్తీవి లక్ష్మణదాసు.

భా షా ప్ర వీ ణ,
యేలూరిపాటి అనంతరామయ్య.
ఎం. ఏ., (తెలుగు) ఎం. ఏ. (సంస్కృతము) బి. ఇ. డి.,
ప్ర ధా నా చా ర్యు లు :
డాక్టర్ కె. వి. కె. సంస్కృత కళాశాల
గుం టూ రు :

# అనుశీలన

ఎప్పుడైనాసరే, రచనలు చేసేవాళ్లు చాలా రకాలుగా ఉంటారు.

ఇది వ్రాయాలనీ, ఇలా వ్రాయాలనీ, ఇందుకు వ్రాయాలనీ, దీనికి ఇంతశక్తి కావాలనీ, దీనికి ఇట్టి సాధన కావాలనీ, ఇంతశక్తి తమకు ఉన్నదనీ తెలిసి, అది, ఆలా, అందుకు, ఆ పరిమితులలో, వెలితి కాకుండా - నిండుదనంతో వ్రాసేవాళ్లు ఒకరకం.

ఏదైనాసరే, ఎలావ్రాస్తున్నారో, ఎందుకు వ్రాస్తున్నారో, తమ బలమెంతో, తమ కృషియెట్టిదో - ఇవేవీ ఆలోచించకుండా బహుశః ఆలోచించాలని కూడా తెలియకుండా వ్రాసేవాళ్లు మఱొక రకం. ఇందుకు కారణం అజ్ఞానం అయినా, అశ్రద్ధ అయినా ఫలితం ఒకటే.

అయితే, మొదటిరకం సకృత్తుగానూ, రెండోకొ పకు సమృద్ధి గానూ ఉంటారు.

మొదటి రకాన్ని మెచ్చవచ్చు - వచ్చునేమీ ? మెచ్చుకో వాలి - కాని, రెండోరకాన్ని ఏమీ అనటం న్యాయం కాదు పాపం ! అయినా, మొదటిరకం లాభాలు మాకూ- జబ్బుసత్తువ

ఉన్నది కనుక- కావాలంటారు వీళ్లు. అలాంటప్పుడు వాళ్లని ఉపేక్షించనూ కూడదు. అంతవఱకూ రానంతవఱకూ ఉపేక్షచాలు.

ఇంతకూ మొదటి రకానికి చెందినవాడు ఈ నీలివెన్నెలల వింత చంద్రుడు మత్తివి లక్ష్మణదాసు అనబడే లక్ష్మణ దేశికేంద్రుడు. దేశికేంద్రుడల్లా ముద్దుకొద్దీ బంధువులనోళ్లలో అనుచిత విభాగం పాలై 'కేందు' అయి, 'ముముక్షువు' సంపాదకుడు లక్ష్మణదాసుగా స్థిరపడ్డాడు, ప్రస్తుతానికి.

ఇతనికి ఏరకం రచన చేయటానికైనా తగు 'పిండి' ఉన్నది. కనుకనే పద్య 'క్వణత్కింకిణి' ప్రకటించి రససిద్ధుడనీ, మా యిద్దతి సోదరీ, ఏలూరు సెంట్ థెరిసా'స్ స్త్రీల కళాశాల భౌతికశాస్త్ర విభాగాధ్యక్షురాలూ అయిన కుమారి మత్తివి అలమేలుమంగ తాయారు సహకర్తృత్వంతో, 'గోపీహృదయం' అనువాద వ్యావహారిక వచన రచన ప్రచురించి 'ఇంత మంచి తెలుగు వచనం అనువాదమా ?' అనీ, కొన్ని సంవత్సరాలుగా - దాదాపు ఇరవై ఏళ్లుగా - ముముక్షువు సహాయ సంపాదకుడుగా, సంపాదకుడుగా ఉంటూ 'ఓహో' అనీ, అనిపించుకొంటూ, ప్రస్తుతం 'నీలివెన్నెలలు' వెలయిస్తున్నాడు.

అయితే, ఈ సత్తువ ఇతనికి ఉత్తపుణ్యాన వచ్చింది కాదు; ప్రస్తుతం శ్రీశ్రీశ్రీ(1008) సీతారామ యతీంద్రులుగా ఉన్న, ఇతని మిగతా పుస్తకాలతోపాటు దీనినీ అంకితం పుచ్చుకొన్న, కన్నయ్య సీతారామానుజాచార్యులవారి శిక్షణవల్లా, కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠంలో శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారాయ గురువుల కృపతవల్లా వచ్చి, హెచ్చింది మతి. కవికి కావలసిన అన్ని లక్షణాలూ, లక్ష్మణ సహజమైన ఆవేశం, కుండబ్రద్దలు కొట్టి - నట్లు కాదు, అక్షరాలా కొట్టి - మాటాడటంతో సహా ఉన్నవాడు. అలాగని అమాయికుడు కాడు. మాయికుల మాయలను గట్టిగా

ఛిన్న భిన్నం చేయగల తెలివీ, చేవా ఉన్నవాడే. వీటికితోడు, సన్నిహితులు 'అబ్బా' అనుకోదగిన అనేక విధాలయిన పరిస్థితులవల్ల, రచనకు ప్రధానమైన మనస్సు బహుప్రత్యగ్రంగానూ, వ్యగ్రంగానూ, అనితర ప్రగ్రహంగానూ ఉండే అదృష్టానికి నోచుకొన్న దురదృష్టవంతుడు. తన బాధలు తనకే కాక తనతోటివారికీ బాధలు కాకుండా ఉండాలని, సదా సుడిలాగా- సుడిగాలిలాగా కాక- ఎవరినీ కూలద్రోయని ఝంఝాప్రభంజనం అన్నట్లుగా పరిభ్రమిస్తూ, అనేక స్వపరావసరానవసర కార్యాలలో పరిశ్రమిస్తూ, 'ఏపనీ సరిగా స్థిరంగా చేయ'డన్నంతగా, ఎన్నో పనులు కల్పించుకొంటూ, తనమీద రేపు వ్రాలబోయే ఈగకోసం నేడే ఒళ్లు జలదరింపజేసుకొనే సుకుమార ధీర స్వతంత్ర భావకుడు.

మరి ఇతని పేరు చెపితే వెన్నెల కూడా నీలిరంగు వేసుకోక తప్పలేదు. 'అబ్బే, వెన్నెల ఏమిటి? నీలిమ ఏమిటి?' అనుకొన్నా, ఈ పుస్తకమూ, ఇతని ఇతరపుస్తకాలూ చేతపట్టుకొంటే, నీలిరంగుటద్దాలు కళ్ళకు తగుల్చుకొన్నట్లయి, 'వెన్నెలే, ఎండే కాదు, అంతా నీలంగానే ఉన్నట్లు ఉన్నదే! అంతా, నీలంగా ఉన్నట్లూ కాదు, ఉన్నదే ఒక్క- నీలిమ' అనిపించకమానదు.

ఔను, శ్రీ యతీంద్రుల వారి విధంగానే ఇతడూ శ్రీకృష్ణ భక్తుడు, వారి అనేక భక్తులకు వలెనే ఇతనికీ వారే శ్రీకృష్ణులు. లోకంలోని మంచీ-చెడూ, సుఖమూ-కష్టమూ, ఆనందమూ-దుఃఖమూ, సర్వమూ ఆ నల్లనివాని వన్నె చిన్నెలే ఇతనికి.

కనుకనే, ఆ నీలమేఘశ్యామునితో ఇతడు పెట్టుకొన్న మొఱలూ, వానిలాలనలూ, వివరించిన - వాని - లోకం పోకడలూ మొదలయినవన్నీ కలిసి-సహజంగానే-నీలివెన్నెల లయ్యాయి.

ఇందులో ఉన్నవి ఇరవై అయిదు ఖండికలు. వీటిని ముందు రెండు విభాగాలు చేయవచ్చు. మొదటి పదిహేడూ

లయానుగుణ మాత్రాచ్ఛందో విరచిత సార్థక గేయాలు. కడమ ఎనిమిదీ ప్రస్తుతం వచనపద్యాలనబడుతున్న అనిబద్ధ వృత్తగంధి వచనాలు. వీటిలో మళ్ళీ మొదటి గేయాలు భాషాదృష్టితో రెండు రకాలు. 'లీలామృతం', 'మైమరపు', 'ప్రశ్నోత్తరి' - ఇవి వ్యావహారిక భాషలోనూ, మిగిలిన పద్యాలుగూ గ్రాంథిక భాషలోనూ ఉన్నాయి. గ్రాంథిక గేయాలలోనూ అక్కడక్కడ 'నమ్మాను'వంటి (33 వ పుట) వ్యావహారికపదాలూ, పదమంజీర రవళు (14 వ పుట) లనే వైరిసమాసమూ ఉన్నా, అవి అశక్తి కృతాలు కావు, ఆవశ్యకాలను కొని చేసినవి. వచన పద్యాలన్నీ వ్యావహారికాలే. మొత్తంపై అన్నీ సాహిత్య గౌరవం గలవే.

ఇది వచన పద్యయుగం. ఆఖరుకు శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు కూడా ఇటీవల ఆకాశవాణిలో రెండు మూడుసార్లు గ్రాంథిక వచనపద్యాలు చదివారు.

ఇందులోని ఎనిమిది వచనపద్యాలలోనూ నాలుగు సొంతం, నాలుగు అనువాదాలు. ఆ నాలుగింటిలో రెండు సాధు టి. యల్. వాస్వానీ 1* కవితలకూ రెండు రవీంద్రునికీ అనువాదాలు.

---

*1. కీ. శే. సాధు టి. యల్. వాస్వానీ ప్రఖ్యాత సింధీకవి, ఋషికల్పుడు. తన 87 వ యేట 16-1-1966 వ తేదీని పరమపదించారు పూనాలో. వారికీ ప్రపంచమంతటా వేలాది అభిమానులూ శిష్యులూ ఉన్నారు. ప్రేమగా 'దాదాజీ' (తాతగారు లేదా అన్నగారు) అంటారు. ఆయన తన 80 వ ఏట బెర్లిన్ (జర్మనీ) లో జరిగిన ప్రపంచమత మహాసభకు ఇండియా ప్రతినిధిగా వెళ్ళి, ఆసభలోనూ, అనంతరం యూరప్ అంతటానూ, ఉపన్యసించి, భారతీయ మతభావనలపట్ల, వివేకానందునిలాగే, ప్రపంచమంతటా గౌరవం పెంచారు. జీవితమంతా మానవరూప మాధవసేవలోనూ, అందులోనూ

అయితే, మూలకర్తల భావనలతో, భావాలతో తాదాత్మ్యంపొంది, "ఇదేమిటి, నేను చెప్పవలసినది. నా మనస్సులో ఉన్నది. వీళ్ళు చెప్పివేశారు? ఇంతకంటె ఈ విషయమై నేను చెప్పేదేమిఉన్నది యిక?" అనే ఐక్యభావంతో, ఆనందంలో వ్రాసినవి కనుక, అవీ అతని వాటిక్రిందనే లెక్క. కనుకనే అవి మూలసౌందర్యాన్ని పట్టి కొని రాగలిగాయి.

ఇవి స్థూలరూపభేదాలు. ఇక సూక్ష్మభావనా రూపదృష్టితో చూస్తే మాత్రాబద్ధ గేయాలను ఆఱువిధాలుగా విభజింపవచ్చు.

ఒకటి : వ్యక్తిగతాలు. అంటే, వ్యక్తులగురించి వ్రాసినవీ, కేవలం రచయితకే. సంబంధించినవీ : మొట్టమొదటి 'భక్త్యంజలి'

---

దరిద్రనారాయణసేవలోనూ, దైవసేవలోనూ గడిపారు. రాజపూరులో 'శక్తి ఆశ్రమం' స్థాపించారు. దాన్ని మహాత్ముడూ, పండిత నెహ్రూకూడా దర్శించారు. స్వాతంత్ర్యోద్యమంలో గాంధి మహాత్ముని ఆప్తసహచరుడుగా పని చేశారు. మహాత్ముడు 'యంగ్ ఇండియా' పత్రిక ప్రచురించి నపుడు తొలిసంచికలో తొలిరచన వీరిదే. మానవ సంక్షేమానికి అనేక సంస్థలనూ, ఉచితవైద్యశాలలనూ, ఉన్నత పాఠశాలలనూ, కళాశాలలనూ స్థాపించారు. ఒక పశు పక్షి సేవా సంస్థనూ పుస్తక ప్రచురణ సంస్థనూ స్థాపించారు. ఆంగ్లంలో నూటికి పైగానూ, సింధీభాషలో మున్నూటికి పైగానూ గ్రంథాలు వ్రాసి ప్రచురించారు. వీటిలో కొన్ని జర్మన్ భాషలోనికి కూడా అనువదింపబడ్డాయి. 26-11-69 వ తేదీని భారతప్రభుత్వం, వారి జ్ఞాపకార్థం 20 పైసల తపాలా బిళ్లలను విడుదలచేసింది- (ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా 12-10.69, హిందూ 28-11-69 ఆధారంగా).

స్వీయగురుస్తుతి. 'త్యాగారాధన' త్యాగరాజ ప్రశంసాత్మకం, 'తపన' సాధనలో బడలినప్పటి కవి ఒకానొక మానసిక స్థితిని వ్యక్తం చేసేది. 'స్వాగతము' ఎంత వ్యక్తిగతమో అతనే చెప్పి ఉన్నాడు.

అయితే, రచనలో వ్యక్తిగతస్పర్శ ఉన్నా, రచన సమర్థమైనపుడు సహృదయానికి ఆ వ్యక్తిగతత్వం అడ్డునిలవదు. ఆనంద చర్వణలో అది సర్వగతం అవుతుంది. అట్టివే ఇవి.

రెండు : రచయిత్రి వ్యక్తిగతములే అయినా, ఎవరైనా, ఏనాడైనా, వాటిని తమభావాలనే వ్యక్తం చేస్తున్నట్లుగా పాడుకోదగినవి. దిదృక్షు, అభ్యర్థనము, ఆంతర్యం, వేదన, భరన్యాసం, మొర – ఇవి ఇట్టివి. ప్రసిద్ధ భక్తకవుల పాటలలో అనేకం ఇట్టివే.

మూడు : రచయితనూ ఇతరులనూ ఉద్దేశించిన ఉద్బోధ కలవి : వీటిలోనూ మళ్ళీ వైవిధ్యం. 'హెచ్చరిక' జగదశాశ్వతత్వం తెల్పి విధి నిర్వహణకు పూనుకొనమనీ, 'లీలామృతం' శ్రీకృష్ణ లీలామృత తరంగాలలో ఆడుకొందామనీ హెచ్చరిస్తే, 'మైమరపు' నామసంకీర్తన – హృదయార్పణలను ప్రేరేపిస్తున్నది.

నాలుగు : పరమాత్మను బాలకృష్ణునిగానూ, తనను అతని సేవలుచేసే రాధగానూ భావించుకొన్నవి. 'అభ్యంజనము' 'ప్రసాధనము' ఇట్టివి.

ఐదు : కేవల భగవన్నుతి; 'సౌలభ్యం' ఒకటే ఇట్టిది. నీవు పరమ సులభుడవైనా మేము కనుగొన లేకపోతున్నామంటూ ఆయన సౌలభ్యాని కుదాహరణలిచ్చి కీర్తించటం ద్వారా, 'నన్నూ అలా కాపాడు' అనటం వ్యంగ్యం.

ఆరు : తాత్త్విక వివృతి : పరమ పదారోహణానికి సోపానాలు, అంచెలు, అవసరమనీ, అయితే, లౌకిక ప్రేమరూపంలోని ఆ మెట్లను గుర్తించి వాడుకోవాలని చెప్పే 'ప్రశ్నోత్తరి' ఇట్టిది.

ఇక వచన పద్యాలన్నిటి పనీ వైద్ధోరణులలోనే. ఆత్మ పరిశోధన లేక పోవటమే అన్ని చిక్కులకూ నిదానమనీ, అదొక్కటి చేసుకొంటే అన్నీ కుదురుతాయనీ, 'పరిష్కారం' చెపితే, ఎడద లోతులలో భగవదనుభూతి కలిగించమని 'ప్రార్థన'. సర్వార్పణం త్యాగం అవసరమని 'హెచ్చరిక'. అట్టిదే 'అర్పణ'. అయాచితంగా పండుగాని, పాటగాని, విలువతో నిమిత్తం లేకుండా, హృదయ పూర్వకంగా భగవంతునికి సమర్పించినదే కానుక అంటుంది 'ఉపద'. కలిమిలేములతో విచక్షలేకుండా, రెంటివల్లా బాధా వ్యథలే కలుగుతున్నప్పుడు వాటిని భరించటమే కార్యమన్నది 'కీలకం'. పరిస్థితులకు జడుసుకోవటం, బాధ్యతలకు భయపడటం, తమనీడ చూచుకొనే ఉలికిపడటం, స్వప్రయోజన పరుల మెఱు మెచ్చు మాటలకు లొంగిపోవటం 'పిచ్చి' అంటుంది 'ఉన్మత్త ప్రలాపం'. ఉన్నమాట అన్నవాడిని ఉన్మత్తుడనే అంటుంది లోకం! మంచి పనైనా ఆశ ఒకటే ఉంటే చాలదు. దాన్ని సాధించుకొనే నేర్పు అవసరమనేది 'యోగః కర్మసు కౌశలం'.

వీటి వ్యక్తీకరణలో మనకు పదే పదే కనిపిస్తూ ఈ ఖండికల పట్ల మనకు ప్రీతిని పెంచే విశేషాలను ఏడు విధాలుగా వింగడింప వచ్చు.

మొదటిది : రచయిత్రగల ఆధ్యాత్మిక సాంప్రదాయిక పరిజ్ఞానం. దీనికి నాలుగు ఉదాహరణాలు.

1. భగవంతుని అనంతకళ్యాణగుణాలలో నిగ్రహానుగ్రహాలు ముఖ్యమైనవి. అవిలేని ప్రభువు నెవరూ ఆశ్రయించరు. అయితే అనుగ్రహం అందరికీ కావలసినట్లే నిగ్రహం అందరికీ బాధాకరం. అందుకనే భక్తుడు దేవుని దేవితో సహా సాక్షాత్కరింపమని కోరు కొంటాడు. ఏమంటే, ఆమె తల్లి. ఆమె అనుగ్రహమే కాని నిగ్రహం ఉపయోగింపలేదు, ఉపయోగింపనివ్వదు. ఇది వాల్మీకి మహర్షి

సీతనోట "పాపులైనా, పుణ్యాత్ములైనా, వధార్హులైనా, వారిపట్ల ఆర్యుడు కరుణనే చూపాలి వానరోత్తమా, తప్పుచేయని వాడంటూ లేడు కదా!"[1] అని పలికించటంలో స్పష్టం ఆమె హృదయం. వధార్హులకే అనుగ్రహం చూపమంటే ఇక భక్తుల సంగతి చెప్పే దేముంది? ఆ తల్లి భక్తులకు ఆయన అనుగ్రహము మాత్రమే లభించేటట్లు చేసి పురుషకారభూతురాలై కాపాడుతుంది.

"నను బ్రోవమని చెప్పవే, సీతమ్మ తల్లీ !"

అని భద్రాచల రామదాసు గారు మొఱపెట్టుకొనటానికి హేతువిదే. ఈ విషయం 'దివృక్ష'లో—

"ప్రభుతా ధర్మమ్ముగ నీ ప్రదర్శించు కాఠిన్యము
నీరుచేయు లోకమాత క్షీరార్ణవ కన్యకతో
గరుడనిపై కనరావా!"

(3 వ పుట)

అనటంలో వ్యక్తమవుతుంది.

2. 'దివృక్ష'లోనే ఈ క్రింది పంక్తి ఉన్నది.

"ఇరుల చీల్చులే శంఖము, అరుల కాల్చులే చక్రము"

పైని, ఇరులు అంటే అజ్ఞానం, అరులంటే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే అంతశ్శత్రువులూ అన్న సంగతి సువ్యక్తమే.

3. 'సౌలభ్యం' అన్నది ఒక గేయం పేరు. (3 వ పుట) ఇందులో భగవానుని అనంత కళ్యాణగుణాలలో ప్రధానమైన

---

1. పాపానాంవా శుభానాంవా వధార్హాణాం ప్లవంగమ !
కార్యం కరుణ మార్యేణ నకశ్చిన్నాపరాధ్యతి.

ఆటింటిలో ముఖ్యమైన సౌలభ్యగుణం ఉదాహరణ సప్తకంతో ప్రశంసితం. దీనికీ స్ఫోరకం సంప్రదాయమే.

4. మరొక గేయనామం 'భరన్యాసం' (21 వ పుట). భగవంతునియందు సర్వభరన్యాసం చేయటం అన్నది వైష్ణవ సంప్రదాయంలో అతి ప్రధానం.

రెండవది : ఆంధ్రగీర్వాణసాహితీ సుధను ఆకంఠం పట్టించాడనటానికి ఇందులోని పలుకు పలుకూ నిదర్శనమే.

ఇలా పూర్వ కవి ప్రభావం వర్తమాన కవిపై ప్రసరించటం, అతని రచనలో అది కనిపించటం ఎంతవఱకూ గుణం, ఎంతవఱకూ దోషం అనే విషయమై అభిప్రాయ వైవిధ్యమున్నది సాహితీ లోకంలో. "రచయితవాక్కు పరమస్వతంత్రమై ఉండాలి. అతని పద్యం మఱొకపద్యాన్నో, పదబంధం ఇంకొకపదబంధాన్నో, భావం వేఱొకభావాన్నో జ్ఞప్తికి తెస్తే, అది అతని పారతంత్ర్యానికి చిహ్నం అంటారు కొందఱు. అతని వాక్కు పరమస్వతంత్రమై ఉండాలన్నది నిజమే కాని, తరువాతి విషయం సంపూర్ణతయా అంగీకార్యం కాదు. దీన్నే అంగీకరిస్తే, అంతో ఇంతో అస్వతంత్రతా ముద్ర ఎక్కడో ఒకచోట వీరిచేత వేయించుకోకుండా పోయే కవే మిగలడు. కాళిదాసభవభూతుల పోలికలయినా మిగలకుండా వారిపైనే వాల్మీకి ముద్రలు వేసి వెయ్యవచ్చు. తెలుగులో శ్రీనాథుడు పెద్దన మొదలైన వారిసంగతి సరేసరి. కనుక, ఇది రచయిత అశక్తతకు కాక వ్యుత్పన్నతకూ, అప్రతిభకు కాక రసజ్ఞతకూ, అస్వతంత్రతకు కాక సహృదయతకూ నిదర్శనం అని చాలా మంది సహృదయుల అభిప్రాయం.

ఆలా పూర్వసాహిత్య సౌరభం గుబాళించే కొన్నితావులు :

"ఏచినతమి పాల్గాచుచు నీకై, ఎత్తికొనుట కొక్కింత మసలగా
తల్లి యశోద పదమ్ముల మ్రోల దుమ్ములోనపడి దొరలితివంట"
(8 వ పుట)

దీనికి మూలం "ఏమి అనను యశోదమ్మతల్లీ నిన్ను! మునుపు ఎన్నెన్ని పుణ్యక్షేత్రాలకుపోయి, ఏయే విధానాలతో, ఎన్నెన్ని పుణ్యాలను నీవే కొల్లగొన్నావో గదా! దేవేంద్రుడుగాని, తనంతనే జనించిన బ్రహ్మదేవుడు కాని, మన్మథుణ్ణే మసిచేసిన శివుడు గాని ఎవనిదయను పొందలేదో, ఆ పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపం నీ ఒడిలో కూర్చోగోరి నేలబడి ఏడుస్తూ దొర్లుతున్నాడు" అన్నశ్లోకం [1].

మూలంలో 'నేలమీద దొర్లుతున్నాడు' 'భూమౌ విలుఠతి' అని మాత్రమే ఉండగా 'పదమ్ముల మ్రోల దుమ్ములోనపడి దొరలితి' అన్నది ఇతని చేర్పు కూర్పు నేర్పు. దీనితో మసకమసకగా గర్భగుడిలో ఉన్న నిలువెత్తు రూపు నిలువునా గల ఆయన సౌలభ్య గుణాన్ని కర్పూరహారతిపట్టి భక్తుల కందఱకూ చూపినట్లయింది.

2. 'లీలామృతం' అంతా భావగతమైన భాగవతమే. తప్పదు మఱి. ఆ మహానుభావుడు పోతన్నగారు శ్రీకృష్ణలీలలలో వేటిని మిగిల్చాడు గనుక! అయినా, పదివేల పద్యాలకు సరిపడా 'వేయి పాత్రలకు చెందినవి మిగిలిఉన్నాయి' అని చెప్పి, 'ఆ లీలామృతం కడవలకెత్తుతా' నని ఊరిస్తూ, పండ్రెండు పాత్రలకు సంబంధించిన ఆయన లీలలను, నూటఅరవైయేడు పద్యాలలో, మచ్చుగా,

---

1. కిం బ్రూమ స్త్వాం యశోదే కతికతి సుకృతక్షేత్రబృందానిపూర్వం
గత్వా కీదృగ్విధానైః కతికతి సుకృతా న్యర్జితాని త్వయైవ
నో శక్రో నో స్వయంభూ ర్నచ మదనరిపు ర్యస్య లేభే ప్రసాదం
తత్పూర్ణం బ్రహ్మ భూమౌ విలుఠతి విలపన్ క్రోడమారోఢుకామం!

క్వణత్కింకిణి అనే చిన్న స్వర్ణకలశంద్వారా అందించి చవిచూపి, 'మిగిలినవీ అందించి, పోతనగారిని కాకపోయినా, వీనుమిగులుతా' నంటున్నాడు, అంతశక్తి ఉన్నా, కస్తు వశానా, పోతనగారి మీది భక్తిమూలానా. 'లీలామృతం' రెండవ చరణంలో (17 వ పుట)-

"బృందావనాన అరవింద పత్రమ్ములై
చెలులు పరివేష్టింప చలిది గుడిచేనంట
ఆ చలిది మనము కడుపార మెక్కుదమా !
చలిదిలో ఊరబచ్చళ్లు నంజుదమా!" అన్నాడు.

ఇందులో మొదటి రెండు పంక్తులకూ పోతన్నగారి

"జలజాంతస్థిత కర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న తే
కులచందంబునఁగృష్ణునిం దిరిగిరాఁగూర్చుండివీక్షించుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులుం బువ్వు లా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా"

(శ్రీమన్మహా భాగవతము, దశమస్కంధము, 496 వ పద్యము)

అన్నపద్యమూ, నాలుగవ పంక్తికి,

"మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు
నూరుఁగాయలు దినుచుండు నొక్కఁడు"

(శ్రీ. భా. ద. స్కం. 497 వ ప.)

"చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుగాయలు
వ్రేళ్ళసందులనెల్ల వెలయ నిడికి"

(శ్రీ. భా. ద స్కం. 499 వ ప.)

అను రెండు పద్యాలలోని పంక్తులూ కారణాలు.

3. 'వేదన' మొదటి చరణం (19 వ పుట) లో

"ముక్తి ద్వారము దుర్లభమును ఈ తనువని ఎరిగియు"

అన్నదానికి మూలం "మోక్షద్వారం సుదుర్లభం".

4. అందులోనే మూడవ చరణానికి మూలం "ఆత్మరథిఅనీ, శరీరం రథమనీ, బుద్ధిసారథి అనీ, మనస్సు పగ్గమనీ తెలుసుకో" అన్న కఠోపనిషత్ శ్లోకం. 1.

5. 'భరన్యాసం' అంతటికీ జగద్గురు శ్రీ శంకరాచార్యులవారి "నా హృదయ కపి అత్యంత చంచలమైనది. అది సదా మోహాపు టడవిలో తిరుగుతుంది. జవ్వనుల పాలిండ్ల కొండలపై ఆడుతుంది. ఆశలకొమ్మలపై దూకుతుంది బహువేగంగా, ఇష్టంవచ్చినట్లు, అటూ ఇటూ. కనుక, ఓకపాలధరా, భిక్షూ, శివా, దీనిని భక్తితో గట్టిగా కట్టి, నీవశం చేసుకోండూస్వామీ" అన్నశ్లోకం 2 ఆధారం.

అయితే, లక్షణాలు ఒకటే అయినా ఈ కోతికీ దానికీ చాలా తేడా ఉంది. ఈ కోతిచేసే పనులు చెప్పటంలో కాలానుగుణమైన నాజూకూ ఉన్నది. ఇతనికీ భవభూతి అంటే ఇష్టమే. ఎవరికికాదు? కనుకనే 'బత్తితో' అనటానికి 'బత్తితాటి'అన్నాడు గాయకానుగ్రహ బుద్ధిశీ.

7. చివరిరచనపేరే- 'యోగః కర్మసుకౌశలం' ఒకభగవద్గీతా

---

1. ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ
బుద్ధించ సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ

2. సదా మోహాటవ్యాంచరతి, యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝటితి స్వైరమభితః
కపాలిన్, భిక్షో, మే హృదయకపి మత్యంత చపలం
దృఢం బద్ధ్వా భక్త్యా శివ భవ దధీనం కురువిభో
(శివానందలహరి)

వాక్యం- 1 "యోగమంటే పనులలో నేర్పు" అనిదాని అర్థం.

మూడవది : సుకుమారహృదయం. ఈ గుణం భక్తితో పుట్టిదానితోనే పెరుగుతూ ఉంటుంది. ముఖ్యంగా ఇష్టదైవాన్ని శిశువుగా ఊహించుకొని లాలింప గోరినప్పుడు దీనికి అవధి ఉండదు. మాధవపెద్దిబుచ్చిసుందరరామశాస్త్రిగారి 'మృత్యుంజయం' లో ఇట్టిది చూస్తాం.

'సౌలభ్యం' లో శ్రీకృష్ణుణ్ణి చూచి

"చివరకొక్కపూచెండై వ్రేతలచేతులలోపడి నలిగిపోతివి"

(9 వ పుట) అనిబాధ. ఇది

"రామాలాలీ మేఘశ్యామాలాలీ
తామారాసా నయనా దశరథ తనయాలాలీ
ఎంతో ఎత్తూ మరిగీనావూ ఏమీసేతురా
కాంతాలా చేతులామేనూ ఎంతో కందెరా"

అని ప్రతి తెలుగుతల్లీ పడేబాధే.

ఈ సౌకుమార్యం 'అభ్యంజనము' (28 వ పుట) లోనూ, 'ప్రసాధనము' (26 వ పుట) లోనూ పరాకాష్ఠ స్థితినందుకొన్నది.

నాలుగవది : లోకాలోకననైపుణి- లోకజ్ఞత. ఇది అన్నిటా కనిపించేదే అయినా చివటి సొంతవచనపద్యాలలో మరీ ప్రస్ఫుటంగా ఉన్నది.

ఐదవది : వ్యక్తి నుతిలోనూ మితహితసత్యవాఙ్నిరతి. ఇది

---

1. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ 'యోగః కర్మసు కౌశలమ్'
(భగవద్గీత, 2 వ అధ్యాయం, 50 వ శ్లోకం)

మొదటి గేయంలో నిబిడంగా ఉన్నది. అందులోని మొదటి చరణంలో చెప్పినట్లు భోగమయ జీవనులుగా ఉన్నవారు శ్రీ యతీంద్రులవారి దర్శనమాత్రంచేతనే సర్వమూ వదలి వారి శిష్యులూ, ఆశ్రమవాసులూ అయిన వారిని నేనూ ఎరుగుదును.

మూడవ చరణం, శ్రీవారి నృత్యసహిత సంకీర్తనం చూచి నపుడు, చాలా తగ్గించి చెప్పినట్లు అనిపిస్తుంది.

నాలుగవ చరణమూ అట్టిదే. శ్రీయతీంద్రులవారు ఆశ్రమ కార్యక్రమ నిర్వాహణకుగాను శ్రీరామకైంకర్యభిక్ష చేసేవారు. వారి వారి ప్రార్థనలమీద బీదలు నివసించే గూడెములకు కూడా వెళ్ళి వారి అరుగులపై కూర్చొని, వారి సత్కారం స్వీకరించేవారు. తరువాత మహారాజుల అతిథి గృహాలలో చాతుర్మాస్యవ్రతాలూ నిర్వహించారు. అప్పుడూ, ఇప్పుడూ, వారి ముఖంలోని ఆనందరేఖ ఒకేరీతిగా ఉండేది. ఆదృశ్యాలు తలుచుకొని తద్జ్ఞులు నేడూ “పట్టాభిషేకార్థమైన మంగళవస్త్రాలు ధరించినపుడూ, నారచీరలు దాల్చినపుడూ రాముని ముఖాన ఒకేరీతి కాంతిచూచి జనులు ఆశ్చర్య పోయారు” అన్న కాళిదాససూక్తి 1 జ్ఞప్తికి తెచ్చుకొంటూ ఉంటారు.

ఆఖరిది : భాషపైగల అధికారం. ఇతని శారీరం ఎంతగంభీర మైనదో ఆకాశవాణిలోనూ, అనేక సభలలోనూ ఇతను పద్యాలూ పాటలూ పాడగా విన్నవారెరుగుదురు. అలాగే శరీరమూ, భాషా శరీరమూ కూడా సుపరిపుష్టమైనవే కాని ‘అబ్భనాకారపువి’ కావు. ఇతనినీ, ఇతని త్యాగారాధననూ చూస్తే ఈ సంగతి బాగా తెలుస్తుంది.

---

1. దధతో మంగళక్షౌమే వసానస్యచ వల్కలే
దదృశు ర్విస్మితా స్తస్య ముఖరాగం సమం జనాః
(రఘువంశం; 12 వ సర్గ)

ఇంకా, నీలివెన్నెలలో ఇతని భావవైశాల్యాన్నీ, భావనా వైచిత్రినీ, గ్రథనచాతురినీ, తాత్త్విక సత్యసాంద్రతనూ చాటే విశేషాలు చాలా ఉన్నాయి. కాని, ఇప్పటికే ఇది ఆంజనేయులు వారి వాలమైపోయింది. అయినా, దిఙ్మాత్రదర్శనంగా ఒకటి చెప్పక తప్పదు.

'ఆంతర్యం' (12 వ పుట)లో సర్వత్ర పరమాత్మను దర్శించే నేర్పు కావాలనే వాంఛ విషయం. ఆ 'సర్వత్ర' ను అతడు ప్రతీకలుగా మొదటి చరణంలో సుకుమార మానవ ప్రకృతినీ, రెండవ చరణంలో సుకుమార ప్రకృతినీ, మూడవ చరణంలో కఠోర ప్రకృతినీ, నాలుగవ చరణంలో కఠోర మానవ ప్రకృతినీ పేర్కొన్నాడు. మొదటి రెండుచరణాల విషయక్రమాన్ని బట్టి, మూడవ నాలుగవ చరణాలు ఒకదానిస్థానం మరొకటి దురాక్రమణ చేసినట్లు అనిపిస్తుంది స్థూల దృష్టికి. కాని, మానవ సుకుమార ప్రకృతితో ప్రారంభించి మానవ కఠోర ప్రకృతితో అంతం చేయటం ఉద్దిష్టం. మానవునికాదన్న మాధవసేవ కార్యం కాదని సూచనఫలం. అంతేకాదు, మొదట పసికందు బోసినవ్వునూ చివర, మిత్తికాలి మువ్వల వెనుసవ్వడినీ పేర్కొని, వాటిలో పరమాత్మను చూచే నేర్పు కావాలంటే, మానవజీవన సహజాద్యంతాలూ, సంతోష విషాద దాయకాలూ అయిన జనన మరణాలు రెండూ భగవల్లీలలు గానే గుర్తించి అనవసరములయిన పొంగు క్రుంగులులేని స్థితి కోరుతున్నాడన్న మాట.

ఇలా ప్రతిపంక్తీ ఆలోచనామృతంగా చూడదగినదే కాని, ఎక్కువ భాగం పాటలుగదా అని, తేలికగా కనిపించి వినిపించినవి. కూడా తేలికగా చదివీ, వినీ త్రోసివేయ దగినవి కావు.

ఇదివరకే ముముక్షువు ద్వారానూ, అతడూ, సోదరి కుమారి

ముత్తీవి అలమేలు మంగతాయారూ మాన్యులు చిత్రపు భాస్కరం గారూ, ముత్తీవి పెరుమాళ్ళదాసుగారూ, తదితర భక్తులూ అనేక సభల్లో పాడగానూ, ఇంకా అనేకులు ఆకాశవాణిలో పాడి విని పించగానూ చాలా మందికి, ప్రత్యేకించి ముముక్షుజన సమాజ సభ్యులకు, పరిచితమైనవే. వీటికి పునః నా అనుశీలన అంతగా- కనీసం ఇంతగా - ఆవశ్యకం కాదు. అయినా, సౌదర్యానికి వెలితి రానీయటం ఇష్టంలేక, తన కీర్తిలోకూడా నాకు పాలుపంచాలనే అతని తలంపే దీనికి హేతువు.

ఈ 'నీలివెన్నెలలు' ముంచు ముందు నాలుగు పాయలుగా విడదగిన అఖండ గౌతమికి నాసికాత్ర్యంబకం దగ్గతి రూపం. ఇతడు త్వరలో ఇంకా రచనలు, ఇందులోని నాలుగు ధోరణులకు చెందినవీ చేస్తాడు. కనుక గానయోగ్య సార్థక గేయాలతో ఇంవలి అట్టి వాటిని కలుపుకొని ఒక సంపుటీ, తనకు నచ్చిన సాధు టి. యల్. వాస్వానీ అనువాద వచన పద్యరచనలు ప్రత్యేకంగా ఇంకొక సంపుటీ, అలాగే మేలేర్చిన రవీంద్రుని అనువాద వచన పద్య రచనలు విడిగా వేఱొక సంపుటీ, స్వతంత్ర వచనపద్య రచనలు మఱొక్క సంపుటీ వెలువడతాయి.

వాటిని పచ్చ వెన్నెలలు, కెంపువెన్నెలలు మరేవో వెన్నెలలు అన్నా నాకు మాత్రం అభ్యంతరం లేదు. ఎవరికైతే మాత్రం ఎందుకు ఉండాలి ?

అనంతం

డా. శంకర శ్రీరామారావు :
రామచంద్రరావుపేట :: ఏలూరు.

# అభినందన

చిరంజీవి లక్ష్మణదాసుకు–ఆశీః !

వెన్నెలకు గూడ నీలిమ వెట్టజాలు
చిత్రకారుని గుండెలో చేర్చుకొన్న
ధన్యుడవు నీవు ! వస్త్రావతార మొకటి
సృష్టిచేసిన నవ్యవిరించి వీవు !

శంకర శ్రీరామారావు

## క్ర మ ణి క

○

అనేక సభలలోనూ సందర్భాలలోనూ
అంతో ఇంతో ప్రచారం పొందినాయి ఈగీతాలు.
ఆయా సందర్భాలలో అనుసరించబడిన
రాగతాళాల వివరం ఇస్తున్నాం.
అందరూ ఇవే అనుసరించాలన్న నియతిమాత్రంలేదు.

| గీతం | రాగం | తాళం |
|---|---|---|
| భక్త్యంజలి | తోడి | రూపకం |
| దిదృక్ష | హంసానందిని | రూపకం |
| అభ్యర్థనము | మాల్కోన్ | ఆది |
| సౌలభ్యం | ఖరహరప్రియ | ఆది |
| తపన | భాగేశ్వరి | జంపె |
| ఆంతర్యం | సింధుభైరవి | ఆది |
| స్వాగతము | కల్యాణి | రూపకం |
| లీలామృతం | హిందోళ | జంపె |
| వేదన | సింహేంద్రమధ్యమం | రూపకం |
| భరన్యాసం | భీంపలాస్ | ఆది |
| అభ్యంజనము | ఆనందభైరవి | అట |

| | | |
|---|---|---|
| ప్రసాధనము | రాగమాలిక | అట |
| హెచ్చరిక | మాల్కోస్ | జంపె |
| మైమరపు | యమునాకళ్యాణి | జంపె |
| మొర | మాండ్ | జంపె |
| త్యాగారాధన | రాగమాలిక | ఆది |
| ప్రశ్నోత్తరి | సింధుభైరవి | అట |

## భ క్త్యాం జ లి

అఖిల మానవకోటి
ఆర్తి బాపగ దయను
అవతరించినదేవ !
అంజలులు గొనుమా !

భోగలాలసులు నీ
పుణ్య మూర్తిని చూచి
త్యాగధనులౌతారు
యోగు లౌతారు ....

పలుకు పలుకున తేనె
లొలుకు భవదీయ హృది
చిలుకు నీకను లమృత
శీకరమ్ములు ప్రభూ ! ....

ఘల్లుమన గజ్జియలు
కాలు కదుపుదొ లేదొ
జల్లుమని మా ఎదలు
స్పందించు నో ప్రభూ ! ....

వాడ వాడల కరిగి
గూడె గూడెము తిరిగి
నామ కల్పక మచటు
నాటుచుంటివ ప్రభూ ! ....

ఆచరణ శూన్య శా
స్త్రాలాపుడవు గాక
సాచరణు డౌటయే
సామి నీ ఘనశక్తి ....

తప్పొప్పులను చెప్పి
మప్పి దైవీప్రకృతి
ఆదరింపుము నీ ప
దాను గాముల దేవ ! ....

అఖిలమానవకోటి
ఆర్తి బాపగ దయను
అవతరించిన దేవ !
అంజలులు గొనుమా !

... శ్రీ శ్రీ శ్రీ యతీంద్రగురుస్తుతి ...

## ది దృక్ష

ఎన్ని జాములో వేచి
ఉన్నామురదేవా !
కన్నుల పండువుగా
గరుడనిపై కనరావా !....

ఒదిగి ఒదిగి నీ ఎదలో
పొదువుకొని, అపాంగరుచులు
కౌస్తుభ రత్నప్రోజ్జ్వల
కాంతులతో మేలమాడ -
ప్రభుతాధర్మమ్ముగ నీ
ప్రదర్శించు శౌరిన్యము
నీరుచేయు లోకమాత
క్షీరార్ణవ కన్యకతో
గరుడనిపై కనరావా ! ....

శర్వశిరోభూషాయిత
చంద్రమ స్సుధావీచులు
పాద్యమ్మై, తెలినురువులు
పద నూపురతన్ భజింప,
అంబుజభవ ముఖాంబుజము
లర్చా సుమములు కాగా
అమరులు ముక్కోటియు తమ
అనిమిషతకు చెలగి కొలువ
గరుడనిపై కనరావా ! ....

ఇరుల చీల్చులే శంఖము,
అరుల కాల్చులే చక్రము
దౌష్ట్యోరగము సంగతి
తాచూచునులే గరుడడు ;
కన్నుల పెదవుల వెల్లువ
కాగా కరుణామృతమ్ము,
కనులబడిన అంతెచాలు -
కరవుతీర దర్శింతుము
గరుడనిపై కనరావా ! ....

ఎన్నిజాములో వేచి
ఉన్నామురా ! దేవా !
కన్నుల పండువుగా
గరుడనిపై కనరావా !

... వైకుంఠ ఏకాదశినాడు స్వామి
ఉత్తరద్వార దర్శనానికి పోతూ ...

○

## అ భ్య ర్థ న ము

ఏ నెరుగను నా
కేమి వలయునో
ఈవె ఎంచి ఈరా ! .... దేవ
దేవ ! ఎరగినాఁడా !

ఎదుటివారి కున్నది నాకేదని
ఎంతసేపు నా ఏడుపుగద !....ఆ
ఎదుటివారి కది ముదమొ ఖేదమో -
ఏది కూర్చెనో ఎరుగనుగదరా....

లేనిదెల్ల నా కానందదమని
ఉన్నదెల్ల హేతువు బాధలకని -
దూరపు కొండల నునుపు చూపుతో -
దురపిల్లెద - నాదోసమ్మెరిగితి ....

ఎల్ల ఎరుగుదువు - ఎల్ల కలాడవు
ఎల్ల కేలికవు ఇతమె ఎంచెదవు -
సాజము నీకు కృపామృత మొలుకుట -
నాజతనము ని న్నాశ్రయించుటకె ....

ఏనెరుగను నా
కేమి వలయునో
ఈవె ఎంచి ఈరా !....దేవ
దేవ ! ఎరగినారా !

○

## సౌలభ్యం

సౌలభ్యము నీ సొమ్మురా !
- కన
జాల మదే చిత్రమ్మురా !

ఏచిన తమి పా ల్గాముచు నీకై
ఎత్తికొనుట కొక్కింత మసలగా,
తల్లి యశోద పదమ్ముల మ్రోల
దుమ్ములోన పడి దొరలితివంటు ! ....

చిన్ననాడు బృందాటవిలోన
అన్ని నీవెయని ఉన్నబుడుతల
తన్నులు గ్రుద్దులు మన్నన గొంటివి
తద్దయు పైబడి కూడియాడితివి ! ....

అడుగని వారిది పాపము కాగా
ఆడితి, పాడితి – పిల్లగ్రోవితో –
చివరి కొక్క పూచెండై వ్రేతల
చేతులలో పడి నలిగిపోతివి ....

అయినవారు కిమ్మనక తమ్ముకా
నట్టులుండ సభ నా ద్రుపదాత్మజ
'అన్నా!'యని మనసారపిల్చినని
తాల్చితవే వస్త్రావతారమును! ....

పెద్దపెద్ద విందులను పోద్రోచి
విదురు నింటిలో పీటవెట్టితివి –
విదురుపత్ని ప్రేమలోన పొదిపిన
అరటితొక్కలే ఆరగించితివి ....

అడుగుల పడి శరణన్నమాత్రమున
పార్థు గుఱ్ఱాలబండి తోలితివి
గుఱ్ఱాలకు గుగ్గిళ్ళుమేపితివి –
వారువముల గాయాలు కడిగితివి ....

సౌలభ్యము నీ సొమ్మురా!
కన
జాలమదే చిత్రమ్మురా!

## తపన

అణు వణు వొక ప్రకాశార్ధక
మై గుడుగుడు గుంజమాడ
అల్లంతల వెలుగురేక
అట్టెమెరసి ఇట్టె మరగు

ఎంతని పయనింతునో !
అంతెన్నడు చూతునో !

అనుక్షణము వేదనా వి
షాహుల ఋన లుగ్గడింప -
అదవదవడి దిమ్మవోయి
అడుగు సాగ నోవాటింతు

ఎట్టుల పయనింతునో !
గట్టెన్నడు చూతునో !

ఇది స్థలమో జలమో పయి
ఏదో క్రిందేదో ఏ
మెరుగరాని అవ్యక్త వి
చిత్ర దుర్భరస్థితిలో

ఏవిధి పయనింతునో ....
తావెన్నడు చూతునో ....

ఆర్తినెరయు మనసుతోడి
ఆభిముఖ్యమొకడు తక్క
నాజతనమ్మని లేదిక
నాజతనమ్మని లేదిక

నాధ్యేయమె సాధనమై
నను తనదరి జేర్చికొనుత !

○

## ఆంతర్యం

నిన్నుచూచు నేర్పునీయరా !
కన్నయ్య ! నీ
సన్న ఎరుగు ఓర్పునీయరా !

తల్లి ఎడద పొంగి పొరలు
తమి తేనియ వెల్లువలో
కల్ల కపట మెరుగని పసి
కందు బోసి నవ్వులలో ....

తీవలోన, చివురులోన
పూవుల నెత్తావిలోన
తేటి పాటలోన, నెమ్మి
తీరగు నాట్యమ్ములోన ....

ఉరుములోన, మెరుపులోన
ఉర్వీధర శిఖరమ్మున,
ఉర్వర గ్రక్కదలించెడి
ఉరు ఝంఝానిలములోన ....

ఆకలిలో, ఎదిరి కనరు
కేకలలో, ఇక్కట్టుల
మూకలలో - మిత్తికాలి
మువ్వల పెను సవ్వడిలో ....

నిన్నుచూచు నేర్పునీయరా !
కన్నయ్యా ! నీ
సన్న ఎరుగు ఓర్పునీయరా !

○

## స్వాగతము

చెల్లీ ! నేటికి దయచేసితవే !
కన్న
తల్లీ ! ఈనాటికి కృపజూచితవే !

ఎన్నినాళ్ళ కెన్నినాళ్ళ
కీ మాభాగ్యము పండెను !
ఎన్నాళ్ళకు నీ పద మం
జీర రవళు లిటు నిండెను !

సతులకు మెట్టిన ఇల్లే
సర్వమనుట నిజమెగాని,
పుట్టిన ఇంటిని నీవలె
బొత్తుగ మరచెదరటవే ! ....

మురియుచు ఏటేట పెండ్లి
ముచ్చట జరుపుదుము మీకు -
తరతరాల మీ పెండిలి
తలబ్రాలే రక్షమాకు !

చెల్లీ ! నేటికి దయచేసితటే !
కన్న
తల్లీ ! ఈనాటికి కృపజూచితటే !

... లక్ష్మీఅమ్మవారు రచయిత ఇంటి ఆడుపడుచుగా వ్యవహరించుకొనటం, స్వగ్రామంలోని ఆలయంలో కల్యాణసమయంలో, ఆడుపడుచుకు నెరపే మర్యాదలు నెరపటం - వందల సంవత్సరాలుగా వస్తున్న ఆచారం, ఒక సభలో లక్ష్మీఅమ్మవారి ప్రతిమ బహూకరింపబడగా - రచయిత పొందిన అనుభూతి ...

○

## లీలామృతం

పాడవే చెల్లెలా !
పాడరా తమ్ముడా !
పాడుకొందాము గో
పాల బాలుని లీల –
ఆడుకొందాము లీ
లామృత తరంగాల ....

వెన్నదొంగిలెనంట
వేవేల ఇండ్లలో –
అల పాలకుండలనె
అపహరించేనంట –

దొంగిలించిన వెన్న
దోసిళ్ళ తిందమా !
అపహరించిన పాలు
ఆరగించుదమా ! ....

బృందావనాన అర
విందపత్రమ్ములై
చెలులు పరివేష్టింప
చలిది గుడిచేనంటు -
ఆచలిది మనము కడు
పార మెక్కుదమా !
చలిదిలో ఊరబ
చ్చళ్ళు నంజుదమా ! ....

అల గోకుల మ్మెల్ల
ఆదమరచు టదెంత -
విశ్వమోహనముగా
వేణు వూదేనంటు -
మురళీ రవమ్ములో
మురిసి పోదామా !
మురిసి పరవశత మై
మరచిపోదామా ! ....

పాడవే చెల్లెలా !
పాడరా తమ్ముడా !
పాడుకొందాము గో
పాల బాలుని లీల !
ఆడుకొందాము లీ
లామృత తరంగాల !
పాడవే చెల్లెలా !
పాడరా తమ్ముడా !

○

## వేదన

ఎత్తితి మానవజన్మమె -
ఏల కాల్చనా ....
బత్తిని ఇకనైన నీదు
పదములు మది నిల్పనేని ....

ముక్తి ద్వారము దుర్లభ -
మును ఈ తనువని ఎరిగియు
ఉత్తుత్తి విలాసమ్ముల
రిత్తగ పాడొనరించితి ....

పాశవికోద్రేకమ్ములు
పగలు వాంఛలును తీర్పగ
వానికంటె సౌకర్యము
పడయుటే ఫలమ్ముటే ! ....

ఒరు లేయవి యొనరించిన
ఎరియును నా మానస మవి
పరుల గూర్చి చేయ నన్న
పాటియు నే పాటింపనె! ....

సారథిలేని రథమ్ములు
తక్కుజంతువుల తనువులు
సారథి కలిగియు లేడన
జాలు దుర్దశకు లోగితి ....

దశేంద్రియములను మనసా
తావక దాస్యము నెరపుటె
ధన్యతయని తెలిసియు నా
ధర్మమునకు దూరమైతి ....

ఎత్తితి మానవజన్మమె -
ఏల కాల్పనా !

## భరన్యాసం

నామతి అతిచంచల వా
నరము దేవరా !
ఏమో ఎటు దిద్దుదొ - ది
క్కివె కావరా !

పూచిన లతలెల్ల విరిచి
ప్రోవు వెట్టురా !
చూచిన వన్నియు తనకని
సొద యొనర్చురా ! ....

ఎదిరి నురక వెక్కిరించి
ఏచ జూచురా !
ఎదిరి తిరుగవైచి కొట్ట
ఏడ్చి పోవురా ! ....

ముందు వెనుక చూచుకొనక
మోసపోవురా !
మోసము గుర్తింప కందె
మురిగి పోవురా ! ....

బత్తి త్రాటు గట్టి నీవె
భార మూనరా !
పాలనో నీటనో ముంచెడి
భరము నీదెరా ! ....

నామతి అతిచంచల వా
నరము దేవరా !
ఏమో ఎటు దిద్దుదో - ది
క్కీవె కావరా !

○

## అభ్యంజనము

చిన్నికృష్ణా! ఆగుమోయీ!
చిందులాపు ఒకింత సమయము
చిటికెలో జలకమ్ము పూరిత
చేతులేవయ్యా! ....

అబ్బ! ఏమిది! ఇంత ఆగడ
మైన నే భరియింపజాలను!
అరనిముసము స్థిరముగా కా
లాగ బోవదుగా! ....

నీరు జిమ్మకు! నీకె చెప్పుట -
చీరయంతయు తడిసినదిగద!
పీరు డట్టుల నవ్వెదవు ఈ
వెకిలి పనులకెగా! ....

అమ్మతో చెప్పేదను సుమ్మా !
అంతకంతకు మేరమీరెదు !
కమ్మగా వడ్డించువరకూ
రిమ్మ వదలదుగా ! ....

అయ్యోకృష్ణా ! ఇంతలోనే
అంత మోమును ముడువవలెనా ?
అల్లరికి భరియింపజాలక
అంటి నంతియెగా ! ....

అన్నమాత్రన చెప్పినానా
అమ్మతో -ఉత్తుత్తిమాటలు !
అందమంతయు పోయె నా క
న్నయ్య ! చూడుమయా !

కంటి నీరా ముద్దులయ్యా !
పంటి గాటా పెదవికయ్యో !
కఠినురాలిని నీదు మనసును
గాయపరచితిగా ! ....

ఏది మోమిటు త్రిప్పుమయ్యా !
ఇట్లు - పైటతొ తుడుతునయ్యా !
నీదు చిత్తమువచ్చినట్టులె
నీవు సేయుమయా ! ....

చిటికెలో జలకమ్ము పూరితి
చేతులేవయ్యా ! ....

○

## ప్ర సా ధ న ము

నల్లనయ్యా ! రాగదోయీ !
చల్లనయ్యా ! రాగదోయీ !
ఉల్లమలరగ నీ కలంకృతి
నొనరుతును కృష్ణా ! ....

తమ్మిలో మధువాని మత్తిలి
సొమ్మసిల్లిన తుమ్మెదను నగ
నెమ్మొగమ్మున ముద్దుగా తిల
కమ్ము తీర్తునయా ! ....

అసిత కాంతుల నీనుటనె కా
కార్ద్రితను మొయిలుగమి పోలిన
అలకలకు తడియార ధూప
మ్మంటు నిమ్మోయీ ! ....

కమ్మ కమ్మని తావులను విర
జిమ్ము సంపగితైలమును మో
దమ్ము మించగ కురుల కలదగ
నిమ్ము — బాబుగదూ ! ....

విరుల పుప్పొడి ఏర్చికూర్చిన
కరణి నొప్పెడి పట్టుపీతాం
బరము కట్టెద - ఆటలందున
మాపుకొనకోయీ ! ....

అదిగో ! అప్పుడె ఆటలకు ఆ
రాటపడి పరువిడగ చూచెదు !
అమ్మదొంగా ! నీ చిలిపి వే
షాలు నాకడనా ! ....

ఆకసమ్మున ఇంద్రధనువటు
లందములు చిందంగ నీ శిఖ
యందు ముద్దుగ బర్హిబర్హా
మ్మమరుతును కన్నా ....

మురువు సూపగ నీలినీరధి
తరగ విరిగిన నురుగుకైవడి
ఉరమునందున మేలిముత్తెపు
సరులు కూర్తునయా ! ....

ముజ్జగమ్ముల ఈడులేని స
ముజ్జ్వలమ్మగు కౌస్తుభమ్మును
ముచ్చటగ ధరియింపుమయ్యా
ముద్దుకన్నయ్యా ! ....

దేని మధురరవమ్ము గోపి
గోప గోకుల చాతక వ్రజ
దేవ్యమేఘస్వనమో - ఆ మధు
మురళి కొనుమోయీ ! ....

'ఘల్లు' మని మధురముగ నా హృ
త్కమల కర్ణిక మొరయు నీచిరు
గజ్జియలు ధరియించి కన్నుల
కరవు తీర్చుమురా ! ....

ఏది ఒక ముద్దీగదోయీ !
ఏది ఇంకొకమారు — అబ్బా !
ఎంత తీయగ ఉన్నదోయీ
ముద్దు కృష్ణయ్యా !

○

## హెచ్చరిక

చాలింపరా నిదుర !
పాలింపరా విధులు !
ఏల జాలము సేయ ?
కాల మాగదురా !

తెలిమబ్బు తునకవలె
జల బుద్బుదము కరణి
కలవోలె - ఈజగము
క్షణభంగురమురా !

ఏపాటియైన ఏ
మరుపాటు తగదురా !
దీపముండగ ఇల్లు
దిద్దుకోవలెరా !

సుధలుచిలికే నామ
మధువు నాస్వాదించి
మధుర బ్రహ్మానంద
పదము నందుమురా !

చాలింపరా నిదుర !
పాలింపరా విధులు !
ఏల జాలము సేయ ?
కాల మాగదురా !

○

## మైమరపు

శ్రీ నంద నందనుని
పాటుకుందామా !
ఆనంద జగతిలో
ఆడుకుందామా !
ఆనంద జలధిలో
తేలిపోదామా !

మధురాతి మధురమౌ
మధుసూదనుని నామ
మధువు తెగత్రావి మై
మరచి పోదామా ....

ముదము పొంగార ము
క్త్రిదు పదమ్ముల మ్రోల
హృదయ పుష్పాంజలులు
గ్రుమ్మరిచి-కమ్మగా ....

శ్రీ నంద నందనుని
పాడుకొందామా !
ఆనంద జగతిలో
ఆడుకుందామా !
ఆనంద జలధిలో
తేలిపోదామా !

## మొర

నట్టనడి సంద్రాన
కొట్టుమి ట్టాడు నను
గట్టు చేర్చగ నీవ
దిట్టవని నమ్మాను
ఆదుకోగదవయ్యా ఓ ప్రభూ !
నీ దరికి
చేదుకోగదవయ్యా నా ప్రభూ !

క్రూర నక్ర వ్యూహ
ఘోరార్భటులకు నా
ధీరత్వ మెడలి కడు
దీనతాంధ్యము క్రమ్మె
ఆదుకోగదవయ్యా ఓ ప్రభూ !
నీ దరికి
చేదుకోగదవయ్యా నా ప్రభూ !

ప్రళయ దేవత సేయు
భయ దాట్టహాసమ్ము
పగిది సాగరఘోష
పగుల గొట్టెడి ఎడద
ఆదుకోగదవయ్యా ! ఓ ప్రభూ !
నీ దరికి
చేదుకోగదవయ్యా నా ప్రభూ !

○

## త్యాగారాధన

త్యాగరాజు పదముల మ్రొక్కేము ....
రాగసుధా లహరుల చొక్కేము ....

భోగ దృష్టి నెడసేసిన
రాగమే విరాగము ....
త్యాగదృష్టి నొడగూర్చిన
రాగమె అనురాగము ....
యోగ దృష్టి సుడులురలిన
రాగమే పరాగము ....
త్యాగరాజు ననుసరింప
సర్వమును సరాగము ....
త్యాగరాజు పదముల మ్రొక్కేము ....
రాగసుధా లహరుల చొక్కేము ....

చేవగొన పరార్థ నిష్ఠ
భావమె అనుభావము ....
సేవానిష్ఠ తలిర్చిన
భావమే విభావము ....
దైవనిష్ఠ సడలించిన
భావమే అభావము ....
త్యాగరాజు ననుసరింప
సర్వము సంభావము ....
త్యాగరాజు పదముల మ్రొక్కెము ....
రాగసుధా లహరుల చొక్కెము ....

హేలాకృష్టి నెడల్చిన
తాళమె హింతాలము ....
వేలా కృష్టి క్రమించిన
తాలమే ప్రతాలము ....
నీలాకృష్టి రసించిన
తాళమె హరితాళము ....
త్యాగరాజు ననుసరింప
సర్వమును సుమాళము ....
త్యాగరాజు పదముల మ్రొక్కెము ....
రాగసుధా లహరుల చొక్కెము ....

... త్యాగరాజ ఆరాధనోత్సవాల సందర్భములో ...

○

## ప్రశ్నోత్తరి

ఓతీవ ! ఓతీవ ! ఉరక ఎందులకే
చివురు చేతులు సాచి చేరబోయేవు ?

ఓపాప ! ఓపాప ! నా పుట్టుఫలమై
ఆ మావి నల్లుకొని అదమరచేను !

ఓపూవ ! ఓపూవ ! ఉరక ఎవ్వరికే
తేనె లూరిచి ఎదురు తెన్నుచూచేవు ?

ఓపాప ! ఓపాప ! నాపుట్టుఫలమై
గండుతుమ్మెద క్రోల్చి కన్నుమూసేను !

ఓవీర ! ఓవీర ! ఉరక ఎచ్చటికే
నురుగుల్లు గ్రక్కుతూ పరుగుదీసేవు ?

ఓపాప ! ఓపాప ! నాపుట్టుఫలమై
కడలి కౌగిలిలోన కరగిపోయేను !

ఓకన్నె ! ఓకన్నె ! ఉరక ఏమిటికే
అరమోడ్పు కనులతో కలలు కనేవు ?

ఓపాప ! ఓపాప ! నాపుట్టు ఫలమై
వరుని కౌగిలి నెంచి పరవసించేను !

ఓఅమ్మ ! ఓఅమ్మ ! ఉరక ఏ మంచే
ఊయెల ఊపుతూ ఊసు లాడేవు ?

ఓపాప ! ఓపాప ! నాపుట్టు ఫలమౌ
నినువునకు చన్నిచ్చి నిద్రవుచ్చేను !

ఓతాత ! ఓతాత ! ఉరక ఏలయ్యా
కన్నిటితో రాలు కరగ పాడేవు ?

ఓపాప ! ఓపాప ! నాపుట్టు ఫలమై
దైవము దరిసింప తాపమందేను !

మరి తీవ, పూవు, ఏరును, కన్నె, అమ్మ -
వారి పుట్టువులకు ఫలము లవేనా ?

ఏను, వారును, నీవు - ఎల్లలోకాలు
దైవము వైపుకే తరలిపోవాలి ....
ఆదైవమును చేర అంచెలవన్ని,
అంచె లంచెలు దాటి అందరూ కడకు
దైవమ్ము పాదాల దరికె చేరేరు !

○

# పరిష్కారం

అవునయ్యో ఓ మిత్రమా !
అటూ ఇటూ చూస్తూ
అలా కలియ ద్రొక్కుతావేం ?
అద్దం ముందునుంచో ఒకసారి
అందం బయట పడుతుంది !
అప్పుడు తెలుస్తుంది -
అందరి నవ్వులకూ, ఏడుపులకూ
అసలు కారణం ;
అదొక్కటే
అన్ని సమస్యలకూ
పరిష్కార మార్గం.
ముందు చెయ్యవలసిన
ఆపని చెయ్యక

మూలుగుతావు,
నీలుగుతావు,
ముల్లోకాల మీదా కోపగించుకుని
మూతి ముడుచుకుంటావు !
పిచ్చివాడా ! లే !
వెంటనే
అద్దం ముందు నిలబడు !

○

## ఎడదలోతులలో ....

పరమధామం నుంచి
సందేశహరు డెవడో
వస్తాడని ఎదురు తెన్నులు చూశాను....
విశ్వమోహనుని
విశేషాలకోసం
వేచి, వేచి, ఉన్నాను ....
కాని -
నా ఎడదలో
సద్దులేని ఏదో మర్మం
గద్దె ఎక్కి కూర్చుంది ....
నా కన్నీరు మున్నీరౌ తున్నది
నన్ను చంపేస్తోంది ఈ దుఃఖం !
... ... ...

ఓ నా ప్రాణమా !
నువ్వు దవు దవ్వుల ఉండటంచేత
నా ఇల్లంతా
అవ్యవస్థ పరుచుకుంది ....
నువ్వు నన్ను మరిచిపోయావు -
నా మనస్సు
చిల్లర తిరుగుళ్ళు మరిగింది ....

క్రూరమైన నీ దయకి
గుర్తులూ, నిదర్శనాలూ అయిన
వీటిని
సమీపించ టానికి
సంకోచిస్తున్నా వేమయ్యా ?
కుప్ప కూలిపోతున్న
నా ఇల్లు నిన్ను
గుర్తు చేస్తున్నది ప్రభూ !

... ... ...

నా ఎడదలో
జ్వాలలు రేపిందెవరు ?
నీ అందం కాదూ ?

బాధల మేలిముసుగువల్ల
కలిగే వెలుగుతో
నీ అన్వేషణలో
ఎన్నిప్రదేశాలో ....
ఎన్నియుగాలో ....
ఆ జ్వాల
ప్రజ్వరిల్లుతూనే ఉంది ;
దాన్ని ఉపశమింప చెయ్యటం
నా చేతకాదు-
నీ అన్వేషణలో
దాని అంతటు అదే
హరించనీ !
మూగ వేదనతో
నీ పాదాలప్రోల !
నశించనీ !

... ... ...

ఎడద లోతులనుండి
వస్తున్నది కాదా నా పిలుపు ?
ఎంత తీవ్రవేదనతో
ఎదురు చూస్తున్నాను !

నీ మోము దర్శించాలనీ,
నీ పదధూళి
పెదవులతో తాకాలనీ,
ఆత్మార్పణ రూపమైన
నీ యందలి ప్రేమచేత
ఆచ్ఛాదింపబడి ఉండాలనీ
తప్ప,
మరొక కోరిక ఏదైనా
మహా పాపమే ఔతుంది ;

ఎంతకాలంగానో
ఎదురు చూస్తున్న నన్ను
ఇకనైనా
దయతో చూడు ప్రభూ !
ఎడద లోతులలో
నిన్ను అనుభవించ గలిగేట్టు
అనుగ్రహించు ప్రభూ !

... సాధు టి. ఎల్. వాస్వానీ ఆంగ్ల మూలానికి స్వేచ్ఛాను వాదం ...

○

## హెచ్చరిక

మిత్రులారా !

నేను ఆరాధించే అద్భుతాన్ని
- మిణుగురు మెరుపులో తప్ప -
మీరు చూశారా ?

ఆ అన్వేషణలో
మీ సర్వస్వాన్నీ
విరజిమ్మాలిసుమా !

మిత్రులారా !

అట్టడుగున ఉన్న
అతణ్ణి పట్టుకోవాలంటే
మున్నీటిలో మీరుకూడా
మునిగి పోవటానికి
సిద్ధంగా ఉండాలి !

మిత్రులారా !

ఒడుదుడుకులు లేని
బాటలో - అతనికోసం
పడిగాపులు కాస్తున్నారా ?
ఏదో అతనికి
ఇంత విదుపుదా మనుకుంటున్నారా ?
అదీ కాకపోతే -
ఏమాత్రం నమ్మకం లేకపోయినా,
గొంతు చించుకుని
ఏవేవో ఇచ్చకాలు
ఏకరువు పెడతారా ?

... ... ...

... సాధు టి. ఎల్. వాస్వానీ ఆంగ్లమూలానికి స్వేచ్ఛానువాదం ...

## అర్పణ

ఓ ప్రభూ !
శకుంత సంతానానికి
చక్కని పాట ప్రసాదించావు -
అందుచేత అవి కమ్మగా
ఆలపిస్తున్నాయి ....
నాకు కంఠస్వరం మాత్రమే
నయ్యా నువ్వు ప్రసాదించింది !
అయినా నిన్ను నేను గానంతో
ఆరాధిస్తున్నాను ....

పవనానికి నువ్వు ఏ
బరువులూ భారాలూ లేకుండా చేశావు -
కనుకనే అది సునాయాసంగా నీ
కనుసన్నల్లో మెలగగలుగుతున్నది ....

మోయరాని బరువు భారాలెన్నో
మోపావు గదయ్యా నా మీద !
ఈ కంపతోడు గంతా
ఈడ్చుకు రావాలిగదా నేను !
చస్తూ, పుడుతూ,
చచ్చి చెడి, ఏదో విధంగా
సర్వమైన బాధ్యతలూ ఒదిలించుకుని
స్వామీ! నీసేవకోసం
సంసిద్ధుణ్ణై వస్తాను ....

చందమామను ఒక్క
మందహాసంతో సుసంపన్నం చేశావు -
అది ప్రేమామృతం వర్షిస్తూ
అవనీతలం అంతా
అందంతో ముంచెత్తు తున్నది ....
మరి - నాభ్రూయుగ్మాన్ని
మహా వ్యధతో
మలచావుగదా ప్రభూ !
అశ్రు జలంతో దాన్ని
అభిషేకించి
ఆనందంగా పరిణమింప చేసుకుంటానయ్యా
నా ఏలికా!....

కటిక చీకటినీ
కాంతి పుంజాన్నీ
కలిపి రంగరించి
ఉర్వారను సృష్టించి, ఇక్కడికి
ఉత్తి చేతులతో పంపావు నన్ను;
చిలిపి చిరునవ్వు వెలుగులు దోబూచులుగా-ఏమి
చేస్తానో అని గమనిస్తూ,
అవనిని స్వర్గంగా మార్చమని
ఆజ్ఞాపిస్తున్నావు కదూ ప్రభూ ! ....

అందరికీ ప్రసాదించటమే ఎరుగుదువు;
అయినా నానుండి మాత్రం ఏదో
అభిలషిస్తున్నావు ప్రతిగా -
అనురాగాతిశయం ఒక్కటే హేతువుగా
ఆ ఉన్నత సింహపీఠి నుండి
అవతరించి ఆప్యాయంగా
అందుకొంటున్నావు -
అక్కున జేర్చుకొంటున్నావు ....
నీ ప్రసాదంగా లభించిందే వేయిమడుగులుగా
నీ పాదాలముందు అర్పిస్తాను ప్రభూ !

... విశ్వకవి కృతికి భావానువాదం ...

## ఉపద

ఓ ప్రియతమా !
ఈ మధ్యాహ్న వేళలో
ఏది నీకు కానుకగా
ఇవ్వగలను ?
ఉషోగీతమా ?
అయ్యో !
పెచ్చరిల్లుతున్న సూర్యకాంతిలో
వెలవెల పోయిందిగదా ఉషస్సు !
అలసి సొలసిన నాగీతికకూడా
అంతకు మిక్కిలి కాదుగదా !

నాముంగిట అడుగుపెట్టిన ఓ మిత్రుడా !
ఈ మునిమాపు వేళలో
ఏమి కావాలినీకు ?
ఏది కానుకగా
ఇవ్వమంటావు నీకు ?

సంధ్యాదీపమా ?
చిన్నిగదిలో
చేరెడు వెలుగు ఇచ్చేది ఇది -
బయటకు - నలుగురూ కూడేచోటుకు
పట్టుకుపోతావు నువ్వు !
అయ్యో !
గాలితాకిడికి అది
కదలాడి పోతుందిగదా !

ఒకపుష్పమో, హారమో
ఉపదగా నీ కర్పించేందుకు
ఈ దీనునికి అర్హత
ఏమున్నది ప్రభూ !
ఒక్కరోజుకే వాడి వత్తలై పోయే
అట్టి
ఉపాయన భారాన్ని
ఏ విధంగా భరిస్తావు నీవైనా ?
నీ కరకమలాల్లో
నేను ఏమి అర్పించినా
మట్టిగలిసి పోతున్నది -
నీరసించిన నా వ్రేళ్ళసందుగా జారి
నేలపాలై పోతున్నది

ఒకవిధంగా -
విశ్రాంతివేళలో
నువ్వు నా ఉపవనానికి
విచ్చేసి ఉండగా,
చివురాకుల మాటున దాగిన ఏదో
చిన్నిపువ్వు పరిమళాలు
వాసంత సమీరంతోపాటు
పరుగులు పెట్టి వస్తే -
నువ్వు
ఆశ్చర్య చకితుడవై చూస్తే -
అదే నీకు
అనుకోని నా కానుక
అవుతుంది ప్రభూ !

పచ్చని చెట్ల బారులతో నిండిన నా
బాటలో నీవు పయనిస్తూ ఉండగా,
నీ కన్నులు నిద్రాముద్రితములై,
సంధ్యారుణిమలో
చటుక్కున నువ్వు అలా చూస్తే
నీ కన్నుల్లో తేలియాడే స్వప్నాలను
క్రమ్ముకుంటూ ఎఱ్ఱని కాంతికిరణం ఒకటి
కమనీయంగా ప్రసరిస్తే -

అదే - ఆ కాంతే - నీకు
అనుకోని నా కానుక
అవుతుంది ప్రభూ !

తటిత్కాంతిలో
నా మనోజ్ఞ సంపద
తళుక్కున మెరిసి మరుగుపడిపోతున్నది ....
ఎటూ అందని
ఎందునా పొందని
కంఠంలో ఒదగని
కమ్మని స్వరంగా - అనిర్వాచ్యంగా
గతంలో కరిగిపోతున్నది -

ఓ మిత్రుడా !
విలువ తక్కువదో -
విలువే లేనిదో
ఒక పండో - ఒక పాటో
నీవుగా కోరకుండా
హృదయపూర్వకంగా నేను
నీకు సమర్పిస్తే - అదే
నీది - నీకు తగినది - ఔతుంది ప్రభూ!

... విశ్వకవి కృతికి భావానువాదం ...

○

## కీలకం

ఏవో! ఏవో! ఏవేవో
ఆలోచనల లోచనాలకు
అనిమిషత్వం సిద్ధించింది ....

*　　　*　　　*

అంద రానివి
అందినప్పుడల్లా
ఆనందమే కలగాలని
ఎక్కడుంది ?

అరచేతిలో ఉన్న
ప్రతి ఉసిరికకాయా
అంగిట్లో
వేసుకుంటున్నామా ఏం ?

ఉన్నవి
ఎందుకున్నాయా అనిబాధ;
లేనివి
ఎందుకు లేవా అనివ్యథ;

ఉన్నవి
లేకుండాపోతే
లేనివే
అవుతున్నప్పుడు

లేనివి
ఉండేస్థితివస్తే
ఉన్నవాటిల్లోనే జమ
అవుతున్నప్పుడు
ఈ బాధా, వ్యథా
ఏమవుతాయి ?

ఆప్తమిత్రుల్లా
కలకాలం
అంటిపెట్టుకొని
ఉంటాయి ....
ఉండనిద్దాం !
ఏంచేద్దాం ?

○

## ఉన్మత్త ప్రలాపం

పిచ్చి! పిచ్చి! పిచ్చి!
ఎవరికిరా పిచ్చి?
'పిచ్చి' పిచ్చి పట్టిందేంరా
మీ అందరికీ?

'పిచ్చి' అంటే
'ప్రెతి పదార్థం' చెప్పు!
వందకి వందా ఇచ్చి
అందలం ఎక్కిస్తాను!
ఆలెక్కని పిచ్చిలేనివాణ్ణి
అస లొక్కణ్ణి చూపించు!

వేపకాయంత మీ కుంటే
వెలక్కాయంత నా కుంది -

ఈ మాత్రం దానికేనా
ఇంతరభస చేస్తున్నావు ?

తమ త్రోవను
తాము పోతున్న
పరిస్థితుల
పాముల్ని చూసి,
పగబట్టా యనుకుని,
భయపడి
పారి పోవటానికి చేసే
ప్రయత్నం కాదుట్రా
పిచ్చి అంటే !

అకస్మాత్తుగా
గొంతుకకు
అడ్డం పడ్డ
అనుకోని బాధ్యతల
ఈగని
కక్కలేక, మింగలేక
కళ్ళు తేలవెయ్యటం కాదుట్రా
పిచ్చి అంటే !

కుంభాకార దర్పణంలో
ముఖంచూసుకుని

గుండె బాదుకోటం
పిచ్చికాదూ !

నీతో పనిఉండి వచ్చినవాడు
నిన్నుగురించి చెప్పిన వన్నీ
నిజం అనుకోవటం
పిచ్చికాదూ !

పిచ్చివాడా !
పిచ్చి అంటే
ప్రతివాడికీ ఉండే
విలక్షణమైన లక్షణం !

○

## "యోగః కర్మసు కౌశలమ్!"

పై పై మెరుగులకు లోగి
పంకజాన్ని నీరజమాత్రంగా
భ్రమించి,
ప్రక్కనే అడుగుమోపితే -

అడుగున ఉన్న ఊబి
అడుగు మెదపనిస్తుందా ?
అనుగ్రహం చూపుతుందా ?

ముచ్చటైన తావికి లోగి
ముందువెనుకలు చూడకుండా
మొగలి పొదలో
ముక్కు పెడితే -

మొగం అంతా నెత్తురు చెమర్చేట్టు
ముళ్ళన్నీ గీరుకోవూ ?
ముద్దుపెట్టుకుంటాయా ?

జిహ్వా చాపల్యానికి లోగి
చెట్టున కనపడ్డ తేనెపెరను
చేత్తో పిండుకు
త్రాగబోతే -

కూర్చుకుని కాపాడుకుంటున్న ఈగలు
కోపించటంలో వింతేముంది ?
కుట్టకుండా ఎలా ఉంటాయి ?